# అనూ మార్గం

[ఏకాంకిక]

ఆకుపచ్చరంగు పేముసోఫా. దానికి ఎడంవైపుగా ఆనుకునివున్న పేముస్టూలు మీద, అప్పుడే చెట్టునుంచి కోసుకువచ్చిన గులాబీగుత్తి, సోఫాలో విశ్వాస్ (వయసు: యిరవై ముప్ఫయి మధ్య) రాజెన్‌బాబు India Divided పేజీలు తిరగేస్తూ మధ్య మధ్య..............

ఎదురుగా పరిచిన తివాసీ పైకూచుని ప్రయాణరాట్నం మీద నూలు వడుకుతున్న అనూరాధ (వయసు: ఉచితంగా యిరవై) అవస్తని క్రీగంట పరిశీలిస్తూ వుంటాడు. రాధ రాట్నాన్ని ఒక కాలితో అదిమిపెట్టి, ఎడం చేత్తో చక్రం రెండు చుట్లు తిప్పేటప్పటికి, రాట్నం పక్కకి వొరిగిపోవడమో, దారం పుటుక్కున తెగడమో జరుగుతోంది. అతని పరిహాసమూ, ఈమె మందహాసమూ గాలిలో కల్పిస్తున్న చైతన్యాన్ని, కుడిమూలని వున్న బుద్ధవిగ్రహం నిర్వికారతతో గమనిస్తోంది.

వి—మీదటికి నేనింక బట్టలు కొనుక్కోనక్కర్లేదనుకుంటాను.

అ—ఛా. నీకా ఈ ముతక గుడ్డలు! ఆఖరికి నౌకరీ కుర్రాడికి కూడా ఆ నీలంగుడ్డ బావుంటుంది కాని యిది బావుండదు.

వి—మునుపంటే అన్నావు—యిప్పుడలా అనకూడదు-ఘట్టిగా!

అ—ఏం కొరత వేయిస్తారా, కొట్లో పెట్టిస్తారా? వ్యక్తి స్వాతంత్ర్యానికి విలవ ఛస్తే, స్వరాజ్యానికి అర్థం ఏమిటి?

వి—వ్యక్తిస్వాతంత్ర్యం అంటే నోటికొచ్చినట్లు వాగడం కాదు, అనూ.

అ—నేనేం పొరబాటు అన్నాను? నాకు ముతకగుడ్డలు లేవు. ఉన్నమాట చెప్పాను.

వి—ఖద్దరువల్ల దేశానికి ఆర్థికంగా...

అ—వొద్దు, వొద్దు. ఆ లెఖ్ఖలు చెప్పకు—నాకు భయమేస్తుంది. ఇండియాలో యిరవైమూడేళ్ళే బతుకు తారనీ, బేడా అర్థణాకి మించి తినడం యింకోడి కడుపు కొట్టడమనీ నాకు చెప్పకు. ఎన్ని కేలరీల వేడి తినాలి నువ్వు రోజూ, వూరికే కూచునేవాడివి—కట్టెలు కొట్టేవాడివీ బట్టలు కుట్టేవాడివీ కావుగా!...ఏం లెక్కలు, విశ్వాస్, యివి!

వి—Mathematics is the only true science.

అ—ఆమాట నిజమే కావచ్చు; కాని ఈ అంకెలమోజు శతాబ్దపు గాలిలో వుంది. ప్రతివాడూ అంకెలతో మనల్ని మభ్యపెట్టాలని చూస్తాడు. సున్నాలని చూసి వుబ్బి తబ్బిబ్బవు తారే గాని సున్నాల వెనకవున్న పదార్థసత్తువని గమ నించరు మాట వరసకి—సూర్యుడు మనకి తొంభయి కోట్ల మైళ్ళ దూరంలో వున్నాడంటే హాయి. ఈ అంకెల నిర్ణయం విషయమై మేధావులు బుర్రలు బద్దలుగొట్టుకుంటారు, విశ్వాస్! తొంభయి మైళ్ళయితేనేం, తొమ్మిది కోట్ల మైళ్ళయితే నేం! మనిషి ప్రత్యక్ష సిద్ధాంతంతో రుజువు చెయ్యలేనంత దూరం.

వి—నువ్వు $a^2$, $b^2$ కూరల మార్కెట్‌లో ఎందుకు వుపయోగపడదని అడుగుతున్నావు. మానవుడు జగత్‌ని తన కొలత ప్రకారం చూస్తాడు. నువ్వు చెప్పిన తొంభయి మైళ్ళకీ తొంభయికోట్ల మైళ్ళకీ మానవుడి గ్రాహ్యశక్తి ప్రకారంవున్న తేడా స్వల్పం. మతవాసనవున్న వేదాంతికీ—భూమిని అట్లాసన్నా ఆదిశేషువన్నా మోస్తూ వుండాలనే తత్వవేత్తకీ—తన తార్కికజ్ఞానసంపదకి ఆవల వున్న సమస్తం అనంతం. శాస్త్రజ్ఞుడు అలా కాదు—అంతాన్నీ అనంతాన్నీ పెనవేసే ద్వంద్వంలో ప్రపంచపరిణామంలోని పరమాణుశక్తి విలయ తాండవాన్ని మన కళ్ళముందు చూపిస్తాడు. సముద్రంలో జారిపోతానేమో అనేవాడు ఒకడు—సముద్రగర్భంలోనే బడబాగ్నితో పాటు సమస్త సంపదా వుందనేవాడు మరొకడు. ఎవర్ని ఎన్నుకుంటాం, అనూ! ఆటంబాంబ్ నిర్మాణంలో వున్న చిదంబర రహస్యం $e=m E^2$ అనే సిద్ధాంతనిరూపణాట. అంటే నీకూ నాకూ ఏం తెలుస్తుంది—ఐన్‌స్టిన్ లాటి వాడికి మినహా!

అ—ఎన్నాళ్ళనుంచి వింటున్నా ఎప్పటి కప్పుడు నీ మాటలు—సూర్యోదయంలోని నిత్యశోభలా, శశికాంతిలోని కొత్తదనంలా, దప్పికవేళ దాహంలా, గ్రీష్మంలో చెట్టు నీడలా......

లేచి విశ్వాస్‌వైపు రాబోతూ వుండగా వల్లెవాటు ఖద్దరు శాలువాతో దేవముని ప్రవేశం, దేవముని నఖశిఖపర్యంతం కవి, కవితా లక్షణాలు వేషభాషల్లోనే గాక

వి—కవీశ్వరుల కళ్ళకా?

దే—కాదండీ—ప్రజలు తెలివిమీరారు.

అ—మాటల్లో—కార్యాచరణలో కాదు.

దే—ముందు మాట. ఆపైన భావన. తర్వాత దాన్ని కార్యరూపంలో.

వి—అయితే మీ కవిత్వంలో భావన ముందా, మాట ముందా?

దే—మాట.

అ—అదేమిటండోయ్ ! (చిలిపిగా నవ్వుతుంది)

దే—కొన్ని మాటలు అల్లి, మాటల మేళవింపులో భావన రగులుస్తాం. ఆ భావోద్దీపన ప్రజాహృదయంలో కదం తొక్కుతుంది.

వి—మనీ, పొరబడుతున్నారు. మీ భావతీక్షణతకి మాటలు సమిధల్లాంటివి. అసలైన అగ్ని మీ భావనాపటిమలో వుంది.

దే—అవును—అలాగే, అలాగే.

అ—ఎలాగే—ఎలాగే !

దే—ఆయన చెప్పారే—అలాగే...రాధమ్మతల్లీ, మీ కల్యాణ ఘడియకోసం వేచివున్న ఆప్తులలో నేను ఒకడిని. గడిచిన వసంతం రాదు. రాత్రి పరిమళం వేకువతో నశిస్తుంది. మామిడిపూతతోనే కోయిలా, మకరందంతోనే తుమ్మెదా జీవిత ప్రాంగణం చుట్టూ తిరుగుతున్నాయి.—

వి—కవీశ్వరుల కళ్ళకా?

దే—కాదండీ—ప్రజలు తెలివిమీరారు.

అ—మాటల్లో—కార్యాచరణలో కాదు.

దే—ముందు మాట. ఆపైన భావన. తర్వాత దాన్ని కార్యరూపంలో.

వి—అయితే మీ కవిత్వంలో భావన ముందా, మాట ముందా?

దే—మాట.

అ—అదేమిటండోయ్ ! (చిలిపిగా నవ్వుతుంది)

దే—కొన్ని మాటలు అల్లి, మాటల మేళవింపులో భావన రగులుస్తాం. ఆ భావోద్దీపన ప్రజాహృదయంలో కదం తొక్కుతుంది.

వి—మునీ, పొరబడుతున్నారు. మీ భావతీక్షణతకి మాటలు సమిధల్లాంటివి. అసలైన అగ్ని మీ భావనాపటిమలో వుంది.

దే—అవును—అలాగే, అలాగే.

అ—ఎలాగే—ఎలాగే !

దే—ఆయన చెప్పారే—అలాగే...రాధమ్మతల్లీ, మీ కల్యాణ ఘడియకోసం వేచివున్న ఆప్తులలో నేను ఒకడిని. గడిచిన వసంతం రాదు. రాత్రి పరిమళం వేకువతో నశిస్తుంది. మామిడిపూతతోనే కోయిలా, మకరందంతోనే తుమ్మెదా జీవిత ప్రాంగణం చుట్టూ తిరుగుతున్నాయి.—

అ—ఎవరయినా పెళ్ళికొడుకుని చూడండి—నచ్చితే చేసుకుంటాను. పోనీ మీరు చేసుకోకూడదూ ?

దే—నేనా, నేనా! నా సంపాదన అంతా కలిపితే మీకు రెండు చీరెలు రావు. వేళాకోళం ఎందుకు గాని

అమ్మా—ఆలస్యం దేనికి. మేమందరం సంతోషించే వాళ్ళమేగా! ఆ—(విశ్వాస్ వైపు చూపిస్తూ) ఏదో ఒక్కసారి టీపార్టీ చేసెయ్యండి.

అ—ఘోరం. అతన్నా ? ఇంట్లోంచి పొమ్మంటా డిప్పుడు.

వి—అంత పెద్దగా మాట్లాడకు, అనూ.

దే—ఆయ నెప్పుడూ అలా అనరు. మీరంటే ఆయన కిష్టమే!—నాకు తెలుసుగా!

అ—చెప్పారా ?

దే—రామ రామ.

'జైహింద్', 'జైహింద్' అంటూ నేతాజీ ఫొటోవున్న త్రివర్ణ పతాకం దబ్బాతో వాలంటీరు ప్రవేశం. చందా తీసుకు వచ్చేందుకు అనూరాధ లోపలికి వెళ్తుంది.

దే—ఈ రాట్నం ఎప్పట్నుంచి ?

వి—మూడురోజుల క్రితం సుమతీ ఈవిడా ఎగ్జిబిషన్‌కి పోయారు. అక్కడ వాళ్ళకి తెలిసినవాళ్ళందరూ రాట్నాలు కొంటూవుంటే, వీళ్ళూ రెండు పోర్టబుల్ సరుకులు పట్టుకొచ్చారు.

అ—ఎవరయినా పెళ్ళికొడుకుని చూడండి—నచ్చితే చేసుకుంటాను. పోనీ మీరు చేసుకోకూడదూ ?

దే—నేనా, నేనా ! నా సంపాదన అంతా కలిపితే మీకు రెండు చీరెలు రావు. వేళాకోళం ఎందుకు గాని

అమ్మా—ఆలస్యం దేనికి. మేమందరం సంతోషించే వాళ్ళమేగా ! ఆ—(విశ్వాస్ వైపు చూపిస్తూ) ఏదో ఒక్కసారి టీపార్టీ చేసెయ్యండి.

అ—ఘోరం. అతన్నా ? ఇంట్లోంచి పొమ్మంటా డిప్పుడు.

వి—అంత పెద్దగా మాట్లాడకు, అనూ.

దే—ఆయ నెప్పుడూ అలా అనరు. మీరంటే ఆయన కిష్టమే !—నాకు తెలుసుగా !

అ—చెప్పారా ?

దే—రామ రామ.

'జైహింద్', 'జైహింద్' అంటూ నేతాజీ ఫొటోవున్న ప్రవర్ణ పరాకం దబ్బాతో వాలంటీరు ప్రవేశం. చందా తెసుకు వచ్చేందుకు అనూరాధ లోపలికి వెళ్తుంది.

దే—ఈ రాట్నం ఎప్పట్నుంచి ?

వి—మూడురోజుల క్రితం సుమతీ ఈవిడా ఎగ్జిబిషన్‌కి పోయారు. అక్కడ వాళ్ళకి తెలిసినవాళ్ళందరూ రాట్నాలు కొంటూవుంటే, వీళ్ళూ రెండు పోర్టబుల్ సరుకులు పట్టు కొచ్చారు.

అ—బతికి వున్నాడా?

దే—(విశ్వాస్‌ని కళ్ళతో పలకరిస్తూ) నేను నమ్మను.

అ—ఏమిటి?

దే—(తెప్పరిల్లి) చచ్చిపోయాడని.

విశ్వాస్ నిశ్చింతగా మళ్ళీ పుస్తకంలో తలదూరుస్తాడు.

అ—మీరు జైలుకి వెళ్ళారా, కవిగారూ!

దే—ఆ—వెళ్లాను, ముప్ఫయిల్లో. బయటకి వచ్చిన తర్వాత ఒక ఏడాది కాయిలా పడ్డాను. ఇక చచ్చినా పోయేదిలేదు. జైళ్ళపట్టక తెల్లదొరలు మనకి స్వరాజ్యం యిస్తారనే మిడిమిడి జ్ఞానంతో పొలోమంటూ పోయాం. అర్ధణాకి బుట్టెడు వుప్పు వస్తూవుంటే, మనం చేసుకోడమేమిటిరా అని మా మామ్మ అంటున్నా వినక, కాసిని వుప్పు నీళ్ళు రాగికాగులో పోసి, నడివీధిలో రాళ్ళపొయ్యి మీద పెట్టాను. పుల్లలు సరిగా మండటంలేదు. వీధినిండ వింత చూడ్డానికి మనుషులు పోగయ్యారు. ఇంకా పోలీసువాళ్ళు రాలేదేమా అని యిటూ అటూ అభిమన్యుడిలా పచార్లు చేస్తూ వుండగా, మా పేట సబిన్‌స్పెక్టరు వచ్చి నన్ను పట్టుకు పోయాడు.

అ—ఇం కెప్పుడూ వెళ్ళరూ?

దే—ఇంకా ఎందుకు! మన వంతు అయిపోయింది. మాట తప్పిస్తున్నారు. ముహూర్తం......

అ—పెళ్ళికొడుకు?

అ—బతికి వున్నాడా?

దే—(విశ్వాస్‌ని కళ్ళతో పలకరిస్తూ) నేను నమ్మను.

అ—ఏమిటి?

దే—(తెప్పరిల్లి) చచ్చిపోయాడని.

విశ్వాస్ నిశ్చింతగా మళ్ళీ పుస్తకంలో తలదూరుస్తాడు.

అ—మీరు జైలుకి వెళ్ళారా, కవిగారూ!

దే—ఆ—వెళ్లాను, ముప్ఫయిల్లో. బయటకి వచ్చిన తర్వాత ఒక ఏడాది కాయిలా పడ్డాను. ఇక చచ్చినా పోయేదిలేదు. జైళ్ళుపట్టక తెల్లదొరలు మనకి స్వరాజ్యం యిస్తారనే మిడిమిడి జ్ఞానంతో పాలోమంటూ పోయాం. అర్థణాకి బుట్టెడు వుప్పు వస్తూవుంటే, మనం చేసుకోడమేమిటిరా అని మా మామ్మ అంటున్నా వినక, కాసిని వుప్పు నీళ్ళు రాగికాగులో పోసి, నడివీధిలో రాళ్ళపొయ్యి మీద పెట్టాను. పుల్లలు సరిగా మండటంలేదు. వీధినిండా వింత చూడ్డానికి మనుషులు పోగయ్యారు. ఇంకా పోలీసువాళ్ళు రాలేదేమా అని యిటూ అటూ అభిమన్యుడిలా పచార్లు చేస్తూ వుండగా, మా పేట సబిన్‌స్పెక్టరు వచ్చి నన్ను పట్టుకు పోయాడు.

అ—ఇంకెప్పుడూ వెళ్ళరూ?

దే—ఇంకా ఎందుకు! మన వంతు అయిపోయింది. మాట తప్పిస్తున్నారు. ముహూర్తం......

అ—పెళ్ళికొడుకు?

అ—నేను విశ్వాస్‌ని ప్రేమిస్తున్నానండి.

దే—శుభం.

అ—అంచేత పెళ్ళి చేసుకోను.

దే—అదేమిటి ?

అ—ప్రేమిస్తున్నాను కాబట్టి పెళ్ళి చేసుకోను..

విశ్వాస్ తపీమని పుస్తకం మూసేసి నగుమోముతో సోఫాలో నుంచి లేస్తూ గులాబీగుత్తి అందుకుంటాడు.

దేవముని 'దీని భావమేమి ?' అనే ముఖంపెట్టి బుద్ధవిగ్రహం వంక చూస్తూ వుండగా....

అనూరాధ చూపు విశ్వాస్ మీద నిలిపి, పైట మొహానికి అడ్డం పెట్టుకోగా....

(తెర)

అ—నేను విశ్వాస్‌ని ప్రేమిస్తున్నానండి.

దే—శుభం.

అ—అంచేత పెళ్ళి చేసుకోను.

దే—అదేమిటి ?

అ—ప్రేమిస్తున్నాను కాబట్టి పెళ్ళి చేసుకోను.

విశ్వాస్ తపీమని పుస్తకం మూసేసి నగుమోముతో సోఫాలో నుంచి లేస్తూ గులాబీగుత్తి అందుకుంటాడు.

దేవముని 'దీని భావమేమి ?' అనే ముఖంపెట్టి బుద్ధవిగ్రహం వంక చూస్తూ వుండగా....

అనూరాధ చూపు విశ్వాస్ మీద నిలిపి, పైట మొహానికి అడ్డం పెట్టు కోగా....

(తెర)

---

మనే యింట్లో వదిలిపెట్టి పోయేందుకు నాకు మనస్కరించదు. పోనీ—అమ్మాయ్ నువ్వు వెళ్ళవే!—అనదు. (సుబ్రహ్మణ్యం ముఖకవళిక పరీక్షిస్తుంది.) అంటే నే నెక్కడ నొచ్చుకుంటానో అని, పాపం — నా వెంట రావాలని వుంటుంది. కాని, పని తెములదు. ఇలాగే మంచి పిక్చర్స్ అన్నీ మిస్ అవుతున్నాను.

వెం—కాలేజీలో వున్నన్నాళ్ళూ మాట్రన్ నిర్బంధనా; ఇక్కడ.........

సు—(తేలికగా) పిక్చర్ చూడనంతమాత్రాన మునిగి పోయిందేమీటి లెండి?

వెం—ఆ—ఏమీ లేదు. కాస్త సత్కాలక్షేపం. మీ కెలా పొద్దుపోతోందో నాకు వింతగా వుంటుంది. చేతినిండా పనివుండే మొగాళ్ళు—మేమే ఒక్కొక్కనాడు మహా వెర్రిగా—కాలగమనం ఆగిపోయిందా అన్నట్లు వీధులవెంట మతిపోయినట్టు తిరిగి, ఆరుసార్లు కాఫీతాగి, అరడజను పాకెట్ల సిగరెట్లు తగలేస్తాం.

సు—ఆడవాళ్ళకి ఆమాదిరి పైత్య ప్రకోపం వుండదు. జేబులు గలగల్లాడుతాయి గనక మొగాళ్ళకే పిచ్చిలూ వెర్రులూ ఎత్తుతాయి.

వెం—ఎంత చదువుకున్నా మన దేశంలో ఆడవాళ్ళు ఆడవాళ్ళే!

మనే యింట్లో వదిలిపెట్టి పోయేందుకు నాకు మనస్కరించదు. పోనీ—అమ్మాయ్ నువ్వు వెళ్ళవే!—అనదు. (సుబ్రహ్మణ్యం ముఖకవళిక పరీక్షిస్తుంది.) అంటే నే నెక్కడ నొచ్చుకుంటానో అని, పాపం — నా వెంట రావాలని వుంటుంది. కాని, పని తెమలదు. ఇలాగే మంచి పిక్చర్స్ అన్నీ మిస్ అవుతున్నాను.

వేం—కాలేజీలో వున్నన్నాళ్ళూ మాట్రన్ నిర్బంధనా; ఇక్కడ.........

సు—(తేలికగా) పిక్చర్ చూడనంతమాత్రాన మునిగి పోయిందేమిటి లెండి?

వెం—ఆ—ఏమీలేదు. కాస్త సత్కాలక్షేపం. మీ కెలా పొద్దుపోతోందో నాకు వింతగావుంటుంది. చేతినిండా పనివుండే మొగాళ్ళు—మేమే ఒక్కొక్కనాడు మహా వెర్రిగా—కాలగమనం ఆగిపోయిందా అన్నట్లు వీధులవెంట మతిపోయినట్లు తిరిగి, ఆరుసార్లు కాఫీతాగి, అరడజను పాకెట్ల సిగరెట్లు తగలేస్తాం.

సు—ఆడవాళ్ళకి ఆమాదిరి పైత్య ప్రకోపం వుండదు. జేబులు గలగల్లాడుతాయి గనక మొగాళ్ళకే పిచ్చులూ వెర్రులూ ఎత్తుతాయి.

వెం—ఎంత చదువుకున్నా మన దేశంలో ఆడవాళ్ళు ఆడవాళ్ళే!

( ఉద్రేకం ఈ షణ్మాత్రం కనపడ నివ్వకుండా )

సు—నాన్నవింటే.........ఆ అడగదలుచుకున్న దేదో అడగండి.

వెం—(ప్రాధేయపూర్వకంగా) మీరు నన్ను పెళ్ళి చేసుకోకూడదూ?

సు—నాన్నవింటే?

వెం—వినరులెండి. ఆయనతో మనవిచేసే వచ్చాను.

సు—(తెల్లబోయి) ఏర్పాటా ? ఇదంతా ఏర్పాటా? నాన్నకికూడా ఆఖరికి నేను బరువై పోయానా? యావజ్జీవం బ్రహ్మచారిణిగా వుండమన్న నాన్నకూడా ఒక కుట్రదారా? (కళ్ళు చెమ్మగిల్లాయి)

వెం—వారిమీద మీరు అకారణంగా అపోహ పడకండి. నేరమంతా నాదే! నాకోరిక తెలియజెయ్యగా "అమ్మాయి నడగవోయ్—అమ్మాయి కిష్టమయితే నా అభ్యంతరమేమిటి?" అన్నారు.

సుమతి—(కొత్తబలంతో) మిమ్మల్ని నేనెందుకు పెళ్ళి చేసుకోవాలండీ?

నాయకుడికి కారణాలజాబితా స్ఫురణకి రాదు. అదీకాక ఆడది 'సిగ్గుపడటమో" "చేసుకోనని అనడమో?" "పెద్దవాళ్ళుండగా"—అని సాకు చెప్పడమో జరుగు తుంది. సుమతి సూటీగా వెంకటసుబ్రహ్మణ్యం అర్థంతల్ని ఎదుర్కొంది.

వెం—(కాస్త తెప్పరిల్లి) మీరంటే నాకు యిష్టం.

సు—ఓ అలా అయితే—చాలా మందికి యిష్టం నేనంటే.

( ఉద్రేకం ఈ పణ్మాత్రం కనపడ నివ్వకుండా )

సు—నాన్న వింటే........ఆ అడగదలుచుకున్న దేదో అడగండి.

వెం—(ప్రాథేయపూర్వకంగా) మీారు నన్ను పెళ్ళి చేసుకోకూడదూ?

సు—నాన్న వింటే?

వెం—వినరులెండి. ఆయనతో మనవిచేసే వచ్చాను.

సు—(తెల్లబోయి) ఏర్పాటా ? ఇదంతా ఏర్పాటా? నాన్నకికూడా ఆఖరికి నేను బరువై పోయానా? యావజ్జీవం బ్రహ్మచారిణిగా వుండమన్న నాన్నకూడా ఒక కుట్రదారా? (కళ్ళు చెమ్మగిల్లాయి)

వెం—వారిమీాద మీారు అకారణంగా అపోహ పడకండి. నేరమంతా నాదే! నాకోరిక తెలియజెయ్యగా "అమ్మాయి నడగవోయ్—అమ్మాయి కిష్టమయితే నా అభ్యంతరమేమిటి?" అన్నారు.

సుమతి—(కొత్తబలంతో) మిమ్మల్ని నేనెందుకు పెళ్ళి చేసుకోవాలండీ?

నాయకుడికి కారణాలజాబితా స్ఫురణకి రాదు. అదీకాక అడది 'సిగ్గుపడటమో' "చేసుకోనని అనడమో?" "పెద్దవాళ్ళుండగా"—అని సాకు చెప్పడమో జరుగుతుంది. సుమతి సూటీగా వెంకటసుబ్రహ్మణ్యం అర్థతల్ని ఎదుర్కొంది.

వెం—(కాస్త తెప్పరిల్లి) మీారంటే నాకు యిష్టం.

సు—ఓ అలా అయితే—చాలా మందికి యిష్టం నేనంటే.

సు—మీసామ్మ్యకి నేను అమ్ముడు పోతానను కున్నారా?

వెం—అని అనుకుంటూనా—బి. ఎ పాసయిన అమ్మాయి గురించి.

సు—మరయితే—మీ సొమ్ము మూట ఎందుకు ఎత్తారు?

వెం—మీ రెరుగున్న యువకులకీ నాకూవున్న తేడా అది ఒక్కటే మిగతా మంచి చెడ్డలు మీకే తెలుసు.

సు—మీరు వొట్టి వెర్రివారండీ! స్త్రీ హృదయం ధనాన్ని ఎప్పుడూ ఆశ్రయించదు.

వెం—అవును, అలాటి హితబోధ లే పుస్తకాలు చెప్తాయి

సు—ఆశాజ్యోతిని ఆర్పెయ్యండి.

వెం—ఓ—దానికేం చాలాసార్లు ఆర్పేశాను. కాని మళ్ళీ ఎందుకో అది ప్రజ్వలిస్తూ వుంటుంది, ఏం చెయ్యను— అసహాయుణ్ణి.

సు—పాపం!

వెం—ఎందుకా వేళాకోళం?

సు—నేను ఎవర్నీ వేళాకోళం చేసి యెరుగను. ఉన్నది వున్నట్లుగా మొహంమీద అనేస్తాను.

వెం—అనెయ్యండి—ఆ అనేదేదో!

సు—మిమ్మల్ని నేను పెళ్ళిచేసుకోను. సుతరామూ చేసుకోను.

వెం—పోన్లెండి. కళ్ళు పెద్దవుల్ని వంచన చెయ్యడం గురించి వెనక చెప్పగా విన్నాను; ఈనాడు చూస్తున్నాను.

మీరు నన్ను పెళ్ళి చేసుకోకపోవడానికి కారణం—మీ రడిగినట్లే ఈ దీనుడు అడగవచ్చా ?

సు—నాకు యిష్టంలేదు మీరంటే.

వెం—నేనంటేనా—పెళ్ళంటేనా ?

సు—(తీవ్రంగా చూస్తూ) మీరంటేనే ?

వెం—ఫలానా అని ఏమయినా కారణం చెప్పగలరా ?

సు—వెంకట సుబ్రహ్మణ్యం అనే పేరువింటే నాకు పరమ అసహ్యం—(నాయకుడు పళ్ళు బిట్టగరిచి ఓర్చుకుంటాడు) అందులో 'వెంకట' వినగానే తేళ్ళూ జెర్రులూ పాకినట్లనిపిస్తుంది. అలాటి దిక్కుమాలిన పేరుగల మనిషిని నా పీకె కోసేస్తే చేసుకుంటానా ?

వెం—వద్దు—వద్దు. ఎంతమాత్రం వద్దు. చూడండి—నేను బ్లాక్ మార్కెట్ మనిషి సుపుత్రుణ్ణి. నేనయితే గుర్రపు పందాలలో తగలేస్తానుగాని రావలసిన చోట ఒక్క రాగిదమ్మిడీ కూడా వదలడానికి—ఈ మనసు వుంది చూశారూ—మా నాన్న నుంచి సంక్రమించిన పాపిష్టి సొమ్ముతాలూకు మనసు—అది ఎంతమాత్రం అంగీకరించదు. ఎల్లుండి మీ నాన్నగారి యిల్లూ పొలమూ వేలాం అయిపోతాయి; మా గుమాస్తా తొందర పెడుతున్నా, యిన్నాళ్ళూ మీమీద వుండే మమకారం కొద్దీ నేనే ఆపించాను.

సు—అదేమిటి ? మా నాన్నగారు మీ కెప్పుడు తనఖా రాశారండీ ఈ ఆస్తి అంతా ?

వెం—నాకు కాదు, మా నాన్నకి. ఏడేళ్ళ క్రితం. అప్పటికి మీ అమ్మగారు బతికే వున్నా రనుకుంటాను.

సు—ఏమండీ, మీరింత చదువుకున్నవారుకదా, నన్ను యిలాంటి యిరుకున పెట్టి పెళ్ళాడమనడం ధర్మమా !

సుమతికి ఈ అప్పువిషయం తెలియదా, తెలిసే తెలియనట్లు నటిస్తోందా అని సుబ్రహ్మణ్యం యిబ్బంది పడతాడు.

వెం—ఇరు కేముంది ?

సు—కాక ! ఇటు నాన్న—అటు ప్రేమ.

వెం—తక్కెటలో పెట్టి తూచండి (ఏదో గ్రహించిన వాడిలా) ప్రేమా ? అదేమిటి ?

సు—(మాట్లాడటం యిష్టంలేనట్టుగా మొహంపెట్టి) ఎందుకులెండి వృథాలాపాలు ? (ఆలోచించేసినట్టు మొహం పెట్టి) మా నాన్నకోసం మిమ్మల్ని పెళ్ళాడుతాను.

వెం—'ప్రేమ' అన్నారు. ఆసంగ తేమిటో చెప్పరూ ?

సు—చెప్పను. ఇంక అది అప్రస్తుతం. ఆ పాత పుస్తకం మూసేసి ఈ కొత్తది తెరుస్తున్నాను.

వెం—మీరు నిజం నాతో చెప్పరూ ?

సు—నిజమయినా సరే—బాధాకారణ మైనప్పుడు దాచమన్నారు—పెద్దలు.

వెం—నాకు సంబంధించని దయితే నాకు అనవసరం. కాని 'ప్రేమ' అన్నారు గనక పదే పదే అడుగు తున్నాను. మీరు ఎవర్నయినా ప్రేమించారా ?

సు—(విరహిణి వోలె) భగ్నవీణని ముట్టకండి. నేను మిమ్మల్ని వెళ్ళొడుతాను. మీా కెందుకింక యితరచింతలు ?

వెం—స్త్రీలకి ప్రపంచం మీాదనే విశ్వాసం తక్కువను కుంటాను. నిత్యమూ కనిపించే అప్పులమీాద అసలే వుండదు కాబోలు, సుమతీ, నాకు మీా హృదయం కావాలి. హృదయ కవాటం తెరిచి మీా తీయటిబాధ చెప్పండి. అపశ్రుతి పలకనివ్వను,

సు—మీారా అపశ్రుతి పలకనివ్వనిది ? అది మీాకు సాధ్యం కాదు.

వెం—నాకే సాధ్యం కాకపోతే ఎవరికీ సాధ్యం కాదు. చెప్పి చూడకూడదూ ?

సు—జెలసీతో జన్మంతా కుళ్ళిపోతారేమో ?

వెం—పరిపక్వం కానప్పుడు జెలసీ. నాకు జెలసీ ఏమిటి ? అందులో మీా గురించి.

సు—అయితే చెప్తాను వినండి. వోపికతో వినాలి, బాధపడకండేం !

వెం—(పైకి గంభీరంగా) చెప్పండి.

సు—మూడేళ్ళ క్రితం వేసంగిలో నేను ఒకర్ని ప్రేమించాను. విపరీతంగా ప్రేమించాను. చదువు మానేసి అతనితో లేచిపోదామనుకుని సర్వప్రయత్నాలూ చేశాను. తీరా స్టేషన్ జేరుకునే వేళకి నాన్న వెనకాలే వచ్చి మంచి మాటలు చెప్పి యింటికి పట్టుకొచ్చాడు. ఏంచెయ్యగలను

ఆడదాన్ని! అతని పేరు వసంత్. ఎంత ముద్దుగా వుందో పేరు!

అతనా డబ్బులేనివాడు; నేనా బీదదాన్ని; నాన్నా కట్టు దిట్టం చేశాడు. ఇంకెక్కడికి పోతాను? ఈనాటికి మీ చరణ దాసిని అవుతున్నాను.

వెం—(కుర్చీమీద వేళ్ళతో వాయిస్తూ) ఊం! కుంగి పోకండి! సుమతీ. (రెండు జేబుల్లోనుంచి వందల కట్టలు రెండు—అంటే యిరవైవేల రూపాయిలు తీసి) యివి తీసు కుని అతని దగ్గిరికి వెళ్ళి హాయిగా వుండండి.

సు—ఇంత సొమ్మూ నాకు నిజంగా యిస్తారా?...(అను మానంతో) ఇచ్చినందుకు నా నుంచి ఏం కోరతారో!

వెం—ఏమీకోరను. నిష్కల్మష హృదయంతో తీసు కోండి.

సు—మీ రెందుకు యిలా యిస్తున్నారో అర్థంకావడం లేదు,

వెం—అర్థంకాదు. కొందరు మనుషులు అర్థంకారు. వారిని అర్థంచేసుకోవాలని ఎవరో అభాగ్యులు తాపత్రయ పడి తమ స్వంత సుఖాన్ని చేతులారా చంపుకుంటారు. నేను మీకు ఎందుకు అర్థం అవాలి చెప్పండి? అయిదు నిముషాల క్రితం మిమ్మల్ని ఈ ఆయుధంతోనే బెదిరించాను. ఇప్పుడు అస్త్రసన్యాసం చేశాను. మీ మీద ప్రేమా?— కాదు. నా స్వభావంలోని ఔదార్యమా? అదీకాదు.

అందరి కంటె భిన్నంగా గొప్పగా, ప్రత్యేకంగా, వుండాలనే నా అహంభావం ఇలాటి హటాత్సంఘటనలకి తావిస్తుంది.

సు—(నోట్లకట్టలు రెండూ తీసుకుని) దీనితో మా నాన్న అప్పు తీరుతుంది.

వెం—మీరు అప్పు తీర్చక్కర్లేదు. మీ నాన్నగారి బాకీ చెల్లురాయిస్తాను.

సు—మీ రెలాగయినా ఉదారులు. మీ ఋణం నే నెలా తీర్చుకోగలనో !

వెం—మీరు ఎక్కడో అక్కడ సుఖంగా వుండటమే నాకు ఆనందదాయకం.

సుమతి సోఫాలో నుంచి లేచి సుబ్రహ్మణ్యం వైపుగా వస్తుంది. అతను విస్తుపోయి నుంచుంటాడు.

సు—మీ రే ఆ వసంత్. (రెండుచేతులూ చాస్తుంది. తెల్లబోయిన వెంకట సుబ్రహ్మణ్యం మొహం కర్టెన్ వెనక నించి సుమతి తండ్రి చూసి 'బతికాను బాబూ' అనుకుంటాడు.

(తెర)

———

# కవిగారి మోసం

## శ్రవ్య నాటిక

### పాత్రలు

| | |
|---|---|
| భీమకవి | (రచయిత) |
| జానకి | (అతని భార్య) |
| రామనాథం | (పబ్లిషరు) |
| వెంకటేశ్వర్లు | (బాంకు గుమాస్తా) |
| బాయ్ | (ఆఫీసు కుర్రాడు) |

జానకి—ఇంకా నిద్దర పక్కమీద వుండగానే దండకం మొదలెట్టావు ... అంటారు. ఏంచేసేది? నా చేతనయే దేముంది? పాలవాడు—ఏంటమ్మా మూణ్ణెల్లు అయింది సాయంత్రమయినా యివ్వకపోతే పీల్లేదు—అని బెదిరించి పోయాడు.

భీమకవి—(తాపీగా) కానీ...కాని రోజులు వొచ్చి నప్పుడు ఏంచేస్తాం! రెండు రోజులు పాలుపొయ్యడు—అంతేగా! కాఫీ పొడుం కూడా అయిపోయిందా, టీ యిచ్చావ్?

# కవిగారి మోసం

## శ్రవ్య నాటిక

### పాత్రలు

| | |
|---|---|
| భీమకవి | (రచయిత) |
| జానకి | (అతని భార్య) |
| రామనాథం | (పబ్లిషరు) |
| వెంకటేశ్వర్లు | (బాంకు గుమాస్తా) |
| బాయ్ | (ఆఫీసు కుర్రాడు) |

జానకి—ఇంకా నిద్దర పక్కమీద వుండగానే దండకం మొదలెట్టావు ... అంటారు. ఏంచేసేది ? నా చేతనయే దేముంది ? పాలవాడు—ఏంటమ్మా మూణ్ణెల్లు అయింది సాయంత్రమయినా యివ్వకపోతే వీల్లేదు—అని బెదిరించి పోయాడు.

భీమకవి—(తాపీగా) కానీ... కాని రోజులు వొచ్చి నప్పుడు ఏంచేస్తాం! రెండు రోజులు పాలుపొయ్యాడు—అంతేగా! కాఫీ పొడుం కూడా అయిపోయిందా, టీ యిచ్చావ్ ?

జాన—ఏదో బి. యే. చదువుకున్నాడు కదా, పది రాళ్ళు సంపాదించి మా అమ్మాయిని పోషించలేకపోతాడా— అని మా నాన్న మీకు కాళ్ళు కడిగి కన్యాదానం చేశాడు గాని, ఇలాంటి వెంకిమూరి ఘటం అని తెలిసివుంటే, యింకో ళ్ళకి యిచ్చివుండును.

భీమ—నీ కీ బాధలు తప్పేవి?

జాన—అవును, అందులో పారబాటేమి వుంది—ఏ ఆడదానికి వుండదండీ సుఖంగా వుండాలని?

భీమ—సుఖంగా ఉండాలని ఒక్క ఆడదానికే కాదు, మొగాడికూడా ఉంటుంది. సుఖపడటం మనుషులు నేర్చుకోవాలి. భర్తని ఆడిపోసుకోవడం మినహా భార్యలకి మరొక విద్య తెలుసా!—అని నా అనుమానం.

జాన—మా నాన్న నాకు మెట్రిక్యులేషన్ అయినా చెప్పించలేదు. చెప్పించివుంటే, నాలుగురాళ్ళు నేనే సంపాయించి పోద్దును.

భీమ—చూడు, జానకీ, కష్టాలు కలకాలం కాపరం ఉండవ్. కష్టాల్లోనే మనకి ఓర్పు కావాలి.

జాన—ఏం ఓర్పు—పోనిద్దురూ! మన దారిద్ర్యం ఈ జన్మకి తీరేది కనకనా?

భీమ—'ప్రకటకవీంద్రులే నృపతి పజ్జను నిర్ధనులై చరింతురా వికృతపు జాడ్యమా దొరది—విత్తము లేకయెవారు పూజ్యులు'—అన్నాడు భర్తృహరి.

జాన—ఊఁ...బాధ్యంది, బావుంది. కవిత్వంతో కాలక్షేపం చెయ్యాలనుకున్నవారు, నా గొంతుకొందును కొయ్యాలంట! ఈ ఇద్దరు పిల్లల గతేంగాను! ఎన్ని చెప్పండి. ఈ కష్టాలున్నారు మాకూమా, వీళ్ళ పెళ్ళాం బిడ్డలు పడే అవస్థ, పగవాళ్ళకి కూడా వొద్దు, బాబూ...

భీ—పం, పాపం...అంత శ్రమపడి పోతున్నావా?...

జా—(చిరాకుతో) శ్రమ అంటే ఏమిటి సమ్మదిగా? మధ్యాహ్నం పన్నెండు గంటలకి కిరాణా కొట్టువాడు తయారవుతాడు. మూడుగంటలకి పుల్లల అడితివాడు, అయిదు గంటలకి పాలవాడు, పైగా—"లక్ష్మివారం ఫైసల్ చేస్తానోయ్ మీ అందరి బాకీ"—అని నవాబు దర్జాతో చెప్పేశారు. వాళ్ళు వొచ్చి నా గొంతుకమీద కూచుంటారు. మీరు చల్లగా తప్పుకుని, ఫూరిమీదికిపోయి, రాత్రి పది గంటలకి యింటిమొహం చూస్తారు. నేను చెయ్యాలేను... బాబూ, ఈ కాపరం, ఏ సముద్రా...గోదార్యా......

భీమ—(కటువుగా) జా...న...కీ...!

జాన—(గద్గదికంగా) ఎందుకండీ నా మీద కోప్పడ

కాదు? నేనేం చేసేది చెప్పండి? ఈ కష్టాలకి అంతూ దరీ వున్నాయా?

భీమ—(మనవి చేస్తున్నట్టు) ఇవ్వాళ రామనాథం తప్పక యిస్తాడు. నేను పుస్తకం యిచ్చేసి మూడురోజు లయింది, యివ్వాళ తప్పకుండా యిస్తాడు.

జాన—(దిగులుగా) నిన్న యివ్వనివాడు యివ్వాళ మాత్రం ఎందుకిస్తాడు?

భీమ—నిన్న అతను అసలు ఆఫీసుకే రాలేదు. వస్తే తప్పకుండా ఇచ్చివుందును. మూడొందలూ యివ్వకపోయినా ఒక వంద అయినా ఇచ్చివుందును. ఇవ్వాళ చూడు. మూడొందలూ పట్టుకొస్తాను. అదీగాక, అతను మనకి పూరికే ఇవ్వడం లేదుగా! పుస్తకం తర్జుమా పూర్తి అయిపోయింది. దాన్ని నాన్‌డిటెయిల్డుగా ప్రిస్క్రయిబ్ చేయించుకుని, మనకి మూడు వందలే యిచ్చినా, తనుమాత్రం మూడువేలో పది మూడువేలో రాబట్టుకుంటాడు—దానిమీద.

జాన—అతను ఎంత రాబట్టుకుంటే మనకేం. మన డబ్బు మన మొహాన పారేస్తే, అదే పదివేలు. మీరు ఉద్యోగం చెయ్యకూడదటండీ—మన కష్టాలు తీరుతాయి.

భీమ—ఉద్యోగం పురుషలక్షణం... అన్న మాట నిజమే గాని. కవికి కవనమే జీవనోపాధి.

రామ—నాకు చెప్పకండి అలాంటి పైత్యపు మాటలు... వీధిలోకి వెళ్ళి ఎన్ని గంటలకి వస్తారు?

భీమ—మహారాజు కొట్టులోపున.

ప్రింటింగ్ మెషీన్లధ్వని—(ప్రెస్సాఫీస్)

బాయ్! సార్, సార్, లోపలికి వెళ్ళకూడదు సార్. కార్డ్?

భీమ—నా దగ్గర విజిటింగ్ కార్డులు లేవు.

బాయ్—అయితే, ఈ చీటీమీద రాయండి సార్.

భీమ—చీటీ లేదు, గీటీ లేదు. లోపలికిపోయి భీమకవిగారొచ్చారని చెప్పు.

బాయ్—అయ్యో తిడుతారు సార్...

భీమ—(శాసిస్తూ) వెళ్ళి చెప్పమంటే...

(పాజ్—దూరంనుంచి)

రామ—అదేమిట్రా బాయ్? కవిగారిని బయట నిలబెట్టావా? లోపలికి తీసుకురా.

భీమ—నమస్కారం, రామనాథంగారూ!

రామ—నమస్తే... నమస్తే... కూచోండి. ఈ పక్క కుర్చీలో కూచోండి కాస్త మెత్తగా ఉంటుంది. బాయ్, కాఫీ పట్టుకురారా... మాంచి ఎండలో వచ్చారే...

భీమ—రాక తప్పింది కాదు.

రామ—ఊఁ. ఊఁ. అనుకుంటూనేవున్నా. మీ లాంటి వారిని కష్టపెట్టడం నా కెంతమాత్రం యిష్టం వుండదు. మధ్యాహ్నం...భోజనానికి వెళ్ళేటప్పుడు, మీ ఇంటిదగ్గిర ఆగి, మీకు కనుపించి వెళ్దామనుకుంటున్నాను. ఇంతలో మీరే వచ్చేశారు.

భీమ—దానికేమి లెండి......నిన్న నేను వొచ్చి వెళ్ళినట్టు మీవాళ్ళు చెప్పలేదూ?

రామ—(ఆశ్చర్యంతో) నిన్న వచ్చారా? మీరు?... నిజంగా?

భీమ—మీ మేనేజరుగారి టేబుల్ దగ్గిర గంటన్నర సేపు కూచున్నాను. ఎందుకని ఆయన అడగనూ లేదు. నేను చెప్పనూ లేదు. నేను వచ్చి వెళ్ళినట్టు మీకు తెలియజెయ్యమని మాత్రం చెప్పాను. డబ్బుసంగతి వుంది చూశారూ. అది మీరూ నేనూ చూసుకోవలసింది; మూడో మనిషి దగ్గిర ఆవిషయం ప్రస్తావించడం లాహికీ కాదు, ఏమంటారు?

రామ—చూశారా...ఎంత పని జరిగిందో. మా స్టాఫ్ వొట్టి నిద్రమోతు నజ్జు. ఎవ రెవరో వచ్చి వెళ్ళారని చెప్పారుగాని మీ పేరే చెప్పలేదు సుమండీ. అపచారం—మన్నించాలి. యూ మస్ట్ ఎక్స్క్యూజ్ మీ. కాఫీ పుచ్చుకోండి.

భీమ—(కాఫీ తాగుతూ) చూడండి......ఇవ్వాళ పైకం తప్పనిసరిగా కావాలి...అయిదారేళ్ళ క్రితం యింత యిబ్బంది వుండేది కాదండి. నేనూ మా అన్నదమ్ములూ పంచుకునేటప్పటికి నావంతు ఏడెకరాల పొలం, రెండెకరాల మామిడితోట వచ్చాయి. పొలంమీదా, తోటమీదా వచ్చే రాబడితో మా జీవితం హాయిగా వెళ్ళిపోయేది. మా అబ్బాయికి రెండేళ్ళు వచ్చేదాకా "డబ్బు అవసరం" అంటే ఏమిటో మాకు తెలిసేది గాదండీ అప్పట్నుంచీ అడపా తడపా యిబ్బందులు పడుతూనే వున్నాను. ఇద్దరు రైతులు మా పొలం దున్నుతున్నారు. ఒకడు వొదిలితే ఒకడు బకాయి పెడుతూనే వున్నాడు.

రామ—ఏమోనండీ. పొలాలమీద వచ్చే ఆదాయం నమ్ముకునేందుకు వీల్లేనిది ఈ రోజుల్లో. ఆ పొలం అమ్మేయ్యక పోయారూ ?

భీమ—నేను అమ్ముదా మనుకున్నా, మా ఆవిడ మాత్రం అంగీకరించదు.

రామ—ఆస్తి మీ పేరున వుండగా ఆవిడ యిష్ట మేమిటి ?

భీమ—అది నిజమే అనుకోండి. నన్ను కట్టుకుంది కనక ఆమె ఇష్టాన్ని నేను పాటించకపోతే ఎలా ?

రామ—మీరు చాలా మంచివారు. చాలామందికవులు గంగిగోవుల్లాటివారు.

భీమ—కవులు మంచివాళ్ళేగాని, అంత మరీ మంచి వాళ్ళు గారండోయ్!

రామ—మీ రింకొక్క రెండురోజులు ఆగ గలిగితే...

భీమ—ఏమిటి? పైకానికా?

రామ—ఆఁ...

భీమ—చంపేశారు. ఇవ్వాళ రిక్త హస్తంతో ఇంటికి వెళ్ళడం బదులు ఏట్లోకి వెళ్ళడం మంచిది.

రామ—ప్రింటింగ్ ట్రేడ్ మునుపటిలా కాదండి. కాయితం పౌను అణా, అణాకానీకి అమ్మడం నాకు తెలుసు! ఈ నాడు పౌను తొమ్మిదణాలకి దొరకడం లేదు. ఇన్ని పేజీలు పుస్తకం యింత ధరకే అమ్మాలి...అని నియామకం ఒకటేడిసింది. పబ్లిషర్ రామనాథానికి ఒక కారూ, ఒక బంగళా, ఒక పెద్ద ప్రెస్సూ వుందని పైఆర్భాటమేగాని లోగుట్టు పెరుమాళ్ళకెరుక సుమండీ...రెండేళ్ళ క్రితం అంతా అయిపోయిందనుకున్నాను. కాని, ఆ ఏడుకొండలవాడి ధర్మమా అంటూ బండి ఎలాగో లాక్కొస్తున్నాను.

భీమ—పేద అరుపు ల్లెద్దురూ అవి...మీరు మూడు వందల రూపాయలు ఇవ్వాళ ఇవ్వక పోతే, ఇక్కడ సత్యాగ్రహం చేస్తాడు, భీమ కవి.

రామ—సత్యాగ్రహమే...(నవ్వి) అంతపని చెయ్యనిస్తానా? తల తాకట్టు పెట్టి అయినా మీ కష్టానికి ఆదుకోనూ? మీకీపూట అర్జంటుగా ఎంత కావాలో చెప్పండి.

భీమ—మళ్ళీ దాన్ని ముక్కలుగా చెయ్యాకండి. మూడొంతలూ యిచ్చెయ్యండి ఈ సారికి. మీరు నము తారో నమ్మరో, పదిహేను రోజుల క్రితం నాభార్యా గాజులు కూడా తాకట్టు పెట్టాను. మూడొంతలూ ఒక్కసారి పుచ్చు కోవచ్చునని ఆవేళ మీరు ఏభై రూపాయలు అడ్వాన్సుగా ఇస్తానన్నా వొద్దన్నది. అంచేత......

రామనాథం కాలింగ్ బెల్ నొక్కుతాడు

బాయ్—సార్.

రామ—అకవుంటెంట్ దగ్గిరికి వెళ్ళి చెక్ బుక్ "డి" తీసుకురా.

భీమ—మళ్ళీ చెక్కు ఎందుకండీ?—కాష్ యిప్పిం చేద్దురూ...

రామ—మీరు రావడానికి పది నిమిషాల క్రితమే ఆ సిరాలవాడు—అనగా ప్రింటింగ్ ఇంక్సువాడు—వొచ్చి కాష్ బాక్సు వూడ్చేసి పట్టుకెళ్ళాడు.

భీమ—మీరు ఆ చెక్కు ఏ బాంకుమీద ఇస్తున్నారు?

రామ—బజార్లోదేనండీ... వెళ్ళే దార్లోనే...

భీమ—సరే అలాగే కానివ్వండి.

బాయ్—ఇదిగో సార్. చెక్ బుక్.

రామ—రెండు వందలకి రాస్తాను,

భీమ—కాదు, కాదు.

రామ—రెండువందల యాభై.

భీమ—మళ్ళీ కొసరు ఉంచకండి.

రామ—సరి...ఈసారి మీ మాటే కానివ్వండి. ఇదిగో చెక్కు మూడువందల రూపాయలకి.

భీమ—థాంక్స్...వోచరు తీసుకోరూ?

రామ—ఆఁ...మీ రెక్కడికి పోతారు, నే నెక్కడికి పోతాను...వోచరు పోస్టులో పంపుతాము...ఇస్తున్నది చెక్కేగా...పై నెల మొదటివారంలో మీకు మరొక పుస్తకం యిస్తాను తర్జుమాకి. దానికూడా పేజీకి రెండు రూపాయలకంటె ఎక్కువ ఇచ్చుకోలేనండోయ్. 250 పేజీల పుస్తకం.

భీమ—అలాగే, పంపండి...పదిరోజులలో తర్జుమాచేసి యిచ్చేస్తాను.

* * * *

(దూరంగా) (43, టోకెన్ నెంబరు ఫార్టీ త్రీ. టోకెన్ నెంబరు ఫార్టీ త్రీ. టోకెన్ యిటివ్వండి. మీ చెక్కు మొత్తం ఎంత?)

వెంకటేశ్వర్లు—ఏం బ్రదర్ ఎక్కడ వుంటున్నావ్!

భీమ—ఎవరు వెంకటేశ్వర్లా—నువ్వు ఈ వూరువచ్చి ఎన్నాళ్ళయింది?

వెం—రెండు నెలలవుతుంది. మనం ఏడాదిన్నర క్రితం సామర్లకోట ప్లాట్‌ఫారమ్ మీద కలుసుకున్నాం. అంతేగా? నన్ను కాకినాడ నుంచి విశాఖపట్నం ట్రాన్స్‌ఫర్ చేశారు. అక్కడనుంచి ఈవూరు వచ్చాను. నీకేం...కవివి. అదృష్ట వంతుడివి. పెద్దలు సంపాయించిన పిత్రార్జితంకూడా కాస్త వున్నవాడివి. మాకు మల్లే ట్రాన్స్‌ఫర్లూ, గీన్స్‌ఫర్లూ ఉండవు. మీ ఇల్లెక్కడ?"

భీమ—రామారావు పేటలో...నాలుగవ వీధి.

వెం—అలాగా...మా ఏజంటూ రామారావు పేట లోనే ఉంటున్నాడు. ఏమిటి, పనిమీద వచ్చినట్టున్నావ్...

భీమ—ఆ! ఏం లేదు! చెక్కు ఒకటి ఉంది.

వెం—ఏదీ, యిటు తే...ఎవరిది ?

భీమ—పబ్లిషర్ రామనాథంగారిచ్చినది.

వెం—వాళ్ళ కేదయినా పుస్తకం రాసిచ్చావా? వాళ్ళ చెక్కుల విషయంలో మాత్రం కాస్త జాగ్రత్త, భాయీ.

భీమ—(ఆదుర్దాతో) ఏం...ఏం ?

వెం—మూడొందల చెక్కా ? రామనాథంగారి బాలెన్సు—(లెడ్జరు పేజీలు తిరగేస్తూ) 242—7—5 చూడు. భీమారావు, నీకో చిన్నకిటుకు చెప్పనా ?

భీమ—ఈ చెక్కు మారదంటావా ?

వెం—ఖంగారు పడకు. నేను చెబుతా నుండు... 242—7—5 పైసలలోనూ పది రూపాయిలు కొట్టెయ్. ఎప్పుడైనా మినిమమ్ లేనిదే ఏ చెక్కూ పాస్ చెయ్యడానికి వీల్లేదు. అప్పుడు బాలెన్స్ 232—7—5. నీ జేబులో గాని 68 రూపాయలు వున్నాయా ?

భీమ—68 రూపాయలా ? ఆరణాలు కూడా లేవు...

వెం—అవునవును. ఈ రోజుల్లో 68 రూపాయిలు ఎవరి జేబులో వుంటాయి. కనుక...రామనాథంగారి అక్కౌంటులో 68 రూపాయలు డిపాజిట్ చేస్తున్నట్టు చలానా రాసి, అక్కడ కాషియర్‌కి యియ్యి.

భీమ—ఇస్తే ?

వెం—నీకు 300 లోనూ 68 పోగా మిగతా 232 రూపాయలూ ముడతాయి. లేకపోతే ఈ చెక్కు నీకు యివ్వాళే కాదు కదా, యింకో నెల్లాళ్ళకికూడా కాష్ కాదు. భీమా రావు నా ఫ్రెండ్—అతనికి సాయంచేశాను అంటే, మా ఏజంటు నన్నేమీ అనడు...అదంతా నేను చెప్పుకుంటాను ...నీ కెందుకు ? ట్రాన్సాక్షన్ ఏమిటో తెలుస్తోందా ? నువ్వు 68 రూపాయలు రామనాథంగారి అక్కౌంటులో కట్టావు; అది నా లెడ్జరులో పోస్టయింది; ఆయన అక్కౌంట్ బాలెన్సు 310-7-5; అప్పుడు నీ మూడువందల రూపాయల చెక్కు పాస్ చేశాను; కాష్ అయింది... తెలుస్తోందా ?

భీమ—(వణికే కంఠంతో) ఆఁ... తెలిసింది. నీ మేలు ఏనాటికీ మరవలేను, వెంకటేశ్వర్లూ.

వెం—వోల్డ్ ఫ్రెండ్సుము—మనం ఒకళ్ళ కొకళ్ళం సాయపడకపోతే ఎలా ?

మ్యూజిక్

భీమ—జానకీ, ఇవిగో—చేతికి గాజులేసుకో.

జాన—(సంతోషంతో) మళ్ళీ యివి కంటజూస్తాననుకో లేదండి. ఆ రామనాథంగారి పీకెలమీదకూచుని తీసుకొచ్చి నట్టున్నారు. ఎలా యిచ్చాడండీ ?

భీమ—ఇవ్వక ? చాకిరీ చేశాం...అణాపైసలతో పుచ్చు కున్నాం...ఈ పుణ్యం రామనాథానిది కాదు, మా ఫ్రెండు వెంకటేశ్వర్లుది.

జాన—అలాటి యోగ్యు లుండబట్టే లోకం యింకా యిలావుంది. ఎంత మంచివాడండీ ఆ వెంకటేశ్వర్లుగారు...

భీమ—బాకీలన్నీ తీర్చేశావా ? ఇంక పదిరోజులలో ఆ తోట తాలూకు పైకం రావాలి. అదికూడా వస్తే...

జాన—పదిరోజులు కాదు. ఇంకో నెల్లాళ్ళ దాకా ఏమీ యిబ్బంది లేదు. ఇంట్లోకి కావలసిన సరుకులన్నీ తెప్పించాను. అందరి బాకీలు తీర్చేశాను. ఇంకా 72 రూపాయిలు వున్నాయి...కొల్లలు.

భీమ—రేపు నాకొక రెండు దస్తాల తెల్లకాయితాలు మాత్రం తెప్పించిపెట్టు.

జాన—కవిత్వానికా ?

భీమ—నా పిచ్చి నా కానందం...(కారు హారన్... రెండుసార్లు) రండి......రండి. జానకీ, రామనాథంగారొచ్చారు. కాస్త కాఫీ పెట్టియియ్యి...కూర్చోండి.

రామ—చూడండి. మధ్యాహ్నం చిన్న పొరబాటు జరిగింది. ఈ వందరూపాయిల నోటు దగ్గిర వుంచుకొని, చెక్కు యిటు యిప్పించండి. బాంకులో అంత కేష్ లేదని మీరు వెళ్ళిన తర్వాత అకవుంటెంటు చెప్పాడు.

భీమ—నోటు యిటు తెండి. జానకీ, ఆ నోటు బీరువాలో పెట్టి రామనాథంగారికి 32 రూపాయలు తీసుకొచ్చి యియ్యి.

రామ—అదేమిటి.....32 రూపాయి లేమిటి ?

భీమ——నా చేతిది 68 రూపాయలు వేస్తేగాని, మధ్యాహ్నం మీ రిచ్చిన చెక్కు కాష్ కాలేదు.

రామ——(ఖంగారుగా) అయితే, నా చెక్కు కాష్ అయిందా ?

భీమ——పబ్లిషర్ రామనాథంగారి చెక్కు కాష్ కాక పోవడ మేమిటి ?——కాష్ అయింది. జానకీ, ఏదీ పైకం ? ఇదిగోనండీ 32 రూపాయిలు. మన బాకీ యింతటితో శ్రీరామ.

రామ——(కోపంతో) బాంకు వాళ్ళు ఎలా కాష్ చేశారండీ ఆ చెక్కు ?

భీమ——నేను 68 రూపాయలు నా జేబులో నుంచి తీసి కడితే...

రామ——మీ దగ్గర దమ్మిడీ లేదన్నారే మధ్యాహ్నం ??

భీమ——ఆ కథంతా యిప్పుడెందుకులెండి...

రామ——కవిగారు అసాధ్యుల్లావున్నారే ! 18 ఏళ్ళ బట్టి వ్యాపారం చేస్తున్న రామనాథాన్నే బోల్తాకొట్టించారు. ఎంత మోసం, ఎంత మోసం......

భీమ——నాదా మోసం ?

సమాప్తి.

